# లోకానుభవము





గ్రంథకర్త.

తల్లాప్రగడ సూర్యనారాయణరావు.



సువర్ణమంజరి. ౧



# లోకానుభవము.

(ఈశ్వర మకుటము.)

కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాలయాధ్యక్షుఁడగు
తల్లాప్రగడ సూర్యనారాయణరావుచే
రచియింపఁబడినది.

2000 ప్రతులు.

ప్రథమ ముద్రణము.

వెల 0—4—0



# పీ ఠి క.

---

ఈపద్యములు నేను వ్రాయుటకుఁ గలకారణము స్వవిషయ మనుపీఠికగల13,14,15పద్యములనుబట్టిపాఠకులకు విశదముకాఁగలదు. ప్రసంగము వచ్చినప్పు డీపద్యములలోఁ గొన్నిటి నప్పుడప్పుడు పదుగురి యెదుటఁ జదువుట తటస్థించెను. వారందఱును దీనినిఁ బ్రకటించిన లోకోపకారముగ నుండునని నన్నుఁ బ్రోత్సహింప నొకశతకము వ్రాసి ప్రకటించితిని. మొన్నటి మహాశివరాత్రి పుణ్యకాలమున దీనిని యథా

విధిగాఁ గోవ్వూరియందలి చోళేశ్వరుని కంకితమొసర్చితిని. దీనియందు విశేషముగా వ్యవహారభాషనే సాధువుచేసి వాడితిని. అందుఁ గొన్నిచోట్ల చిన్నయసూరి యొప్పని ప్రయోగములు కొన్ని వ్యవహారసమ్మతములుగను దదితరలాక్షణికుల మతమునను సరించిసాధువులుగను న్నవానినిఁగూడ సందర్భము ననుసరించి యర్థశక్తి వలసినంత నిలుచు ననుతలంపుతో " అందుకు, ఇందుకు, జన్మ, చేతుకు, ఒళ్ళు " మున్నగువానిని వాడితిని. లడలకుప్రాసచేసితిని. ఆంధ్రకవిత్వమున ఛందోవిషయమైన కట్టుబాటులు నానాఁటికి వృద్ధిమై కవిత్వమునకు ప్రబాధ

మగు భావవ్యక్తికన్న శబ్దవ్యక్తికిఁ బ్రాముఖ్యముగల్గు దశపట్టినది. వీని నించుక సడలించి ప్రాధాన్యమునకుహాని లేకుండఁ బ్రవర్తించుట పద్య వాఙ్మయమునకు శ్రేయోదాయకము. ఆంధ్రవ్యాకరణ మసమగ్రముగ నున్నది. ఆకొఱఁత పండితమండలి చేరి నివారణచేసినఁగాని కవులకుసరి యైన సాహాయ్యముచేకూరదు. నాయీయభిప్రాయముతో నేకీభవింపని వారు దీని నొకభిన్నమతముగ నంగీకరింతురుగాకయని నమ్ముచున్నాఁ డను. ఇందలి మాతృదేశప్రశంస ప్రస్తుతకాలానుసారి. ఈగ్రంథమచ్చ గుచున్నకాలమున దీనిని దయాపూర్వకముగ లోపాలోపముల సరి

చూచిన బ్రహ్మశ్రీ శ్రీమన్మహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రులుగారికి కృతజ్ఞతావందనములను సమర్పించుచున్నవాఁడ.

| | |
|---|---|
| కొవ్వూరు<br>గోదావరీతీరము<br>12—3—21 | విద్వజ్జనవిధేయుఁడు,<br>తల్లాప్రగడ సూర్యనారాయణరావు. |

విద్యానిలయముద్రాశాల, రాజమహేంద్రవరము. 1921

శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

# లో కా ను భ వ ము.



ఉ. శ్రీయును వాణియు౯ గలిసి చెంత వసింపఁగ ముక్తి చేకుఱ౯
సాయముసేయుశక్తిఁ గన సాధనమై మెలఁగంగ నిర్వ్యయ౯
నీ యమలాంఘ్రి సేవకయి నిశ్చలభక్తి యొసంగ నెమ్మది౯
జేయఁ గదయ్య దుర్గతుల చెంతకుఁ జేర్పకుమయ్య యీశ్వరా! 1

ఉ. తల్లి ! సరస్వతీ ! నిను సదా భజియించెడువారి కాత్మ రం
జిల్లుటెగాని చింత దరిజేరఁగవచ్చునె మెచ్చునే మనం
బుల్లము పల్లవించు జగదుజ్జ్వలకీర్తి లభించు మోక్షసం
పల్లతవృద్ధిగాంచు; ప్రతిభారతి సత్కవితాప్రభావతీ ! 2

. మాతృదేశస్తవము.

చ [illegible] మహిమంబు గోల్పడినతల్లికి భారతభూమతల్లికిన్
దనతనయుల్ మహోన్నతిని నాగరకత్వము లోకమెల్ల నే
ర్చిన దినముల్ స్మరించి విలపించి కృశించిన కల్పవల్లికిన్
గొనముల పాలవెల్లి కివిగో కయిమోడ్పు లొనర్తునీశ్వరా. 3

ఉ. చల్లని వెన్నెలల్ కనులు చల్లఁగ నుండెడి పైరుపంటలున్
మెల్లన వీచు వాయువులు మేలిమిబంగరు రత్నరాశి రం
జిల్లెడు శైలముల్ విమలజీవనమిచ్చు నదీప్రవాహంబు లు
త్ఫుల్లసముద్రమంబులును ముద్దులు గుల్కెడుతల్లి నెంచెదన్. 4

## కవితాప్రశంస.

చ. కవనములల్లి నీమహిమఁ గాదులఁబోసిరి తొంటి సత్కవుల్
ప్రవిమలదృష్టి గన్గొని; భవన్మహిమల్ చవిఁజూచి యచ్చటన్
గవనము గూర్చువారలకుఁగారె గురూత్తము లాకవీశ్వరుల్
స్తవమొనరింపఁగావలదె సత్కృతికర్తల వారి నీశ్వరా. 5

చ. కవి కొలగాఁడు కావ్యములు గాదెలు, కుంచము వానిబుద్ధి యా
భువనము పంటకళ్లమటుఁ బ్రోవగు రాసులు నీవిలాసముల్,
ఎవరెవ రెంతగొల్తురది యెక్కువ గాదెలకెంత గొల్చినన్
కవికిఁ దరంబె రాశి కడఁగానఁగ, దానిఁ గదల్ప నీశ్వరా. 6

చ. కవితయనంగ పద్యములు గద్యములున్ రచియించుటౌన భా
వవిలసనంబు లోకహితవర్తనముల్ బచరింపఁజేసి క
ర్గవకును నద్దమెట్టులుఁ గ్రంథ చమత్కృతి నేర్పుపెంపునన్
బ్రవిమలవస్తుతత్త్వమును భాసిలఁజేయుట కాక యీశ్వరా. 7

ఉ. ఎన్నక శబ్దజాల ఘటనే క్రియ నుండఁగఁ బోలునో యటుల్
పన్నుపడన్వలెన్; సరిగ భావము లొక్కటి వెన్కనొక్కఁడు
త్పన్నము గావలెన్ నవనవస్ఫురణల్ విలసిల్లఁగావలెన్;
విన్న నదే వినన్వలె కవిత్వమటంచనిపింప నీశ్వరా. 8

మ. కవనంబెల్లను నీదుసృష్టియె జగత్కావ్యంబుసర్వంబు నీ
కవనంబే యది విప్పి చెప్పఁ దెలియంగానైన లేఁడెవ్వఁడున్
ఎవఁడే నచ్చట నొక్కఁ డిచ్చట నొకం డేయర్థమో తీసితా
నవి కల్పించితి నంచు గంతులిడు కావ్యాలివ్వియె యీశ్వరా 9

చ. జగమొకపుస్తకం బచటఁ జాలగనున్నవి పాఠముల్ పఠిం
పగ నెవ రెన్ని చెప్పినను వ్రాసిన నందున నేర్చినట్టి వే
సుగతికిఁ ద్రోవ దుర్గతికిఁ జొప్పును గన్పడు నందె యెవ్వరే
పగిదిని జూతురో యటులె పైకిని జెప్పుచునుందు రీశ్వరా. 10

చ. నిరతము నిన్నె పట్టుకొని నేర్వఁగనుండెడువారు సత్కవుల్
దొరకిన కావ్యశాస్త్రముల ధోరణినుండెడువారు పండితుల్
ఇరుపురిలోన జుట్టఱిక మెవ్వరితోడను నీకు నెక్కుడా
వరుసను జేర్చు వాఁడ నను వాంఛితసిద్ధునిఁ జేయు మీశ్వరా 11

ఉ. పండితులెల్ల సత్కవులభావములన్ గ్రహియించి వానితో
నుండెడువార లందుఁ గలయొప్పును దప్పును గూడఁదీసి లో
నుండు రహస్యభావముల నేర్పుమిగుల్ విడఁదీయుచుండు రా
పండితసత్తముల్ కవులపాలి మెఱుంగులవల్లె లీశ్వరా 12

స్వవిషయము.

ఉ. గుట్టనుమట్టు దెల్పెదను గొంకక స్వానుభవంబు సర్వ మి
ట్టట్టనకుండ సుంతయు రహస్యము నీకడ దాఁపకుండ నీ
కట్టడి తోడ నేమియును గాసిలఁద్రొయఁగరాకుమయ్య యే
పట్టున నైన నీవె పరిపాలనసేతుగదయ్య యీశ్వరా. 13

ఉ. భావము లేడనేడను ప్రపంచము సర్వము సంచరించు, నే
వేవిధమొ యవ్విహారమున నెక్కుడుగా మదినాటుచుందు, నా
భావములం గ్రహించి సరివారలకు న్విశదీకరింతు; నీ
పావననామమున్నిలిపి పద్యశిరోమణి గాఁగ నీశ్వరా ! 14

చ. విసివి యనిత్యసౌఖ్యముల వేసరి శాంతిఁ గనంగలేక నీ
దెసకు మరల్చినాఁడ మది దిక్కిఁక నెక్కడ లేక నీపయిన్
గసిమసిలేనిభక్తి నొసఁగన్ గృషిసేయఁ దలంతు నీకృపా
ప్రసరముచేతఁగాక యొక పట్టున నిల్చునె యద్ది యీశ్వరా. 15

ఉ. చిక్కులు వెక్కుపిక్కటిలి చిత్తము తత్తరమొందువేళ, ని
న్నొక్కపరిన్ స్మరించి మది నూఁచి జపించిన నంతరింపవే
యొక్కఁడిచిక్కు లక్కఁడనె యెన్నఁగరాని సుఖంబుచేరి నై
పెక్కఁడె యంతరంగ మిఁక నేతలఁపుల్ జొరకుండ నీశ్వరా. 16

ఉ. పుట్టుటలెల్ల గిట్టుటకె పోయినవెన్కఁ జముండు పిల్చి నీ
పుట్టుకకున్ ప్రయోజనము పొందితె పుణ్యసమృద్ధి గాంచితే?
పట్టుము చూతమన్న నిలువన్ బరికింత మటన్న నంకె యే
పట్టున నిల్వయుండునన వ్రక్కలగున్ విన గుండె లీశ్వరా! 17

## అ ను తా ప ము.

ఉ. కన్నటు పంది పిల్లలను గాంచితి బిడ్డల పెక్కుమంది గ
గొన్నది యెల్ల నింట సమకూరిచి కూర్చితి నెల్ల యర్థముల్
ని న్నెఱుఁగంగ నైతి నదె నిత్యమటంచుఁ దలంచుకొంటి నే
మన్నను నేమిలాభమని యయ్యము నొద్ద వచింతు రీశ్వరా! 18

ఉ. కన్నులుగప్పి యన్యులను గానిపనుల్ వెయివేలు సేసితిఁ
ఎన్నితి వాని నెన్నదును నెవ్వరునుం గననేరరంచు న
న్నన్న ! ప్రమాదమయ్యెఁ గద యారయ నైతిని లోకచక్షునిఁ
గన్నటునంటివాని నినుఁ గావర మేమని చెప్ప నీశ్వరా! 19

ఉ. ఈశునిఁ గొల్వనుందురు రమేశుని భక్తి భజింపుమందు ర
థేశునిఁ గొల్చిఁ దప్పిన రతీశునిఁ గొల్చును గాని యింక నే
యీశునిఁగూడఁజూడ దిదియేమిదురంతమొ పాడుబుద్ధి నై
యాశయె లేదు; లేదు పరమాత్మ గలండనుచింత యీశ్వరా! 22

ఉ. ఆపద వేళ మ్రొక్కెదుదు రందఱుగూడను దైవమంచు నీ
కోపినమట్టు కష్టయిన నుల్లము నీపయి నిల్పనేర్తురే,
యాపని దీనంతటనె యాపలుకైనను రాదు జిహ్వకున్
కాపురుషుల్ కృతజ్ఞతను గాంతురె స్వప్నము నందు నీశ్వరా! 23

ఉ. కామవికార మొక్కపరి గాటముగా మది నాకెనేని నిం
కేమియుఁ గన్నుగన్పడదు హేయముగాఁ గనుపించు సర్వముల్;
ఏ మొగమైనఁ గన్పడెడు నింపుగ; మోహము కన్నుగప్పినన్
నేమము లన్నియు న్నడచు నిల్వదు చిత్త మొకింతయీశ్వరా. 26

ఉ. నీతికి నిల్చియొక్కొ యవినీతులొనర్పరు లోకమందు; నీ
భీతిని జేయమానుదురె? నెత్తిసుమయ్య స్వలాభమబ్బినన్
నీతియు పాపభీతియును నిల్చునె యక్కగ లోకనిందకున్
భీతిలి. రాజదండనకు బెగ్గిలి సేయరుగాని యీశ్వరా! 27

చ. గడియకుమీఁదవచ్చెడిది గాంచఁగనేరఁడు లోకమంతయుఁ
గడనయొనర్ప నెంచుఁ గలకాలము నీభువి నిల్చునట్లు లి
ప్పుడొ యిఁకనో గుటుక్కుమని పోయెడు గ్రుక్కెడుప్రాణ మప్పుడీ
గడనలు కూడవచ్చునెకొ కాంచఁడు వచ్చెడుదాని నీశ్వరా! 28

చ. ధనమును సంగ్రహింప నతిదారుణకృత్యము లాచరించు దు
ర్జనులు పరోపకారకృషి సాగెడుపట్టున నీతు లెన్నియో
కనఁబఱుపంగనత్తు రెటుగాని దెదో యొక టడ్డుచెప్పి యా
పనిఁగడతేర్చిపోదురు నెపంబు పయింబడకుండ నీశ్వరా! 29

## మనుష్యప్రకృతి.

ఉ. నేరుపవత్తురన్యులకు నీతుల నెన్నియొ యొక్కటేనియుఁ
దేరొనరించిచూపఁగను లెమ్మనువాఁకనె కాని లేచినన్
రారొకరుఁ బిరుంద నయినం బనిసేయఁగ లోకమెల్ల వా
కృూరుల కార్యభీరువుల కూటమియై విలసిల్లు నీశ్వరా! 30

ఉ. చచ్చెను జచ్చె నంచును విచారమునొందెద రేంతొ వింతగా
చచ్చుట వింతయే? తెలిసి చావు నిజంబని చావనట్లుగా
నిచ్చలు సంచరించి గమనింపక పోవుట వింతకాని; యీ
చచ్చుట పుట్టుటల్ దెలిసి చావనిచేతలు సేయ రీశ్వరా! 31

ఉ. ఆరయలేము చేకుఱెడు నట్టిశుభంబులు మాకు మేము నీ
వారసి చేసినట్టి శుభమైన శుభంబుగ నెంచలేము, మా
కోరిన దానికన్న సమకూర్చెడి దీవు ప్రశస్తమెప్పుడున్
నేరము బాగునో గెఱుఁగ; నేర్తుమె నిన్నెఱుఁగంగనీశ్వరా.! 34

చ. ఒకస్థితి లభ్యమైనదని యూరక యుండదు చిత్తమంతలో
నికనొకదానికై పరువులెత్తు లభించిన నద్దికూడ వే
ఱొకటికిఁ జేయిసాచు మది కూరట లేదల మేరువబ్బినన్
సుకమిక నెట్లుపొందు మనుజుండు వశంవదుఁ డాశకీశ్వరా! 35

చ. మనుజుఁడు తా స్వతంత్రుఁడని మాటికిమాటికిఁ జాక వైచెడిన్
ఒనరిచినట్టి దేదొ జయమొందిన నొక్కటి; నిష్ఫలంబులై
చనినవి యించుకంత కొనసాగని వెన్నియొ యున్న మూలమే
మని యనుకోఁడు కర్త జన నాంతరకర్మము నెంచఁడీశ్వరా ! 36

చ. అనుకొనినట్లు లభ్యమయినప్పు నరుండు ప్రయోజకుండ నం
చనుకొను; నిష్ఫలంబయిన నయ్యది దైవముమీఁద మోపెడున్
గనఁబడఁడేల దైవ మటు కల్గిన వేళలఁ గాసినాళ్లటుల్
కనఁబడువయ్య స్నేహితుఁడె కాక విపత్తుల నన్యుఁ డీశ్వరా 37

చ. చెకుముకిరాతి నిన్నుగొని చేడ్పడఁగొట్టిన నగ్నిరేణువుల్
చకచకదీప్తి రాలిపడు సాధులకుం గడగండ్లతాఁకునన్
దికమకకల్గినన్ మదిని దివ్యమహోద్యుతి రాలు విస్ఫులిం
గకములు యుష్మదీయములు కష్టతమస్సు తొలంగనీశ్వరా 38

పరమార్థము.

చ. మెఱుమువలెన్ దళుక్కని నిమేషములోన నడంగు జ్ఞానమా
మెఱుకను గోచరించు మునుపెప్పుడు దోఁపఁగరానిమార్గ మ
త్తఱిని వినంగనౌను నినదంబాకఁడెద్దియొ దానినేవచిం
చిరివిబుధుల్ శ్రుతిస్మృతులచేఁ బరమార్థములంచు నీశ్వరా 39

చ. ధనము గడించినందుకు సధర్ముఁడు కావలె, నింత సుష్ఠుగాఁ
దినవలె, నింత పెట్టవలెఁ దిన్నది యైహికసౌఖ్యమిచ్చుఁ బె
ట్టినయది ముందుమార్గముగడించు నదే పరమార్థమన్నఁ బు
ట్టినదిమొదెందు కట్టిదిగడించి తరింపనుగావె, యీశ్వరా ! 40

ఉ. కోరిక లేక యేపనియుఁ గోరి యొనర్చెడు వాఁడు లేఁడు చే
కూరెడుసంచితార్థములు కోరఁగఁ గోరఁ దదేకదీక్షగాఁ
జేరుఁబరోపకారరతిఁ జిత్తమునన్; బరమార్థమబ్బు; నా
ధారిని బద్ధగోర్కెలకు దారియె కన్పడఁ బోవదీశ్వరా. 41

## మనస్సు

చ. చినతనమాది యెద్ది తనచిత్తమునం దభివృద్ధిగాంచునో
మనమునకద్దితప్ప మఱిమాఱుపథంబు స్ఫురింపఁ బోవదే
పని కలవాటువడ్డ నదె పాపమొ పుణ్యమొ సేయు నందు కే
మనమున కాదినుండియును మప్పవలెన్ బరమార్థ మీశ్వరా. 42

చ. గుఱి మది దేనిపైను సమకూరిచి లక్ష్యముగాఁగ నద్దియే
మఱిమఱి చింతసేయ నిజమానసవృత్తికి స్థైర్యమబ్బు సు
స్థిరత మనస్సుకబ్బునెడఁ జేసినచేఁతకు వృద్ధికల్గుఁ; జే
కుఱు నది నాటనాటనినుఁ గోరి భజించెడువారి కీశ్వరా. 43

చ. స్థిరుఁడగునట్టియాతనికిఁ జిత్తము చెప్పినటుల్ చెలంగు నే
స్థిరునకు నన్ని యున్ని యని చెప్పఁగ శక్యము కాని త్రిప్పలే
తురగము చిత్తవృత్తి పస ద్రొబ్బెడు నేమఱియున్నఁ గళ్లెమున్
దొరకదు పట్టుదప్పినను దుర్లభమా మఱిపట్ట నీశ్వరా. 44

ఉ. పట్టుగ మంచికార్యమును బట్టి యొనర్పఁగఁ బోవు నప్పుడ
ట్టిట్టును లాగు నీమన సదేమివిచిత్రమొ తప్పుత్రోవలన్
బట్టి చరించు చున్న యెడఁ బగ్గము లెన్నిటిఁ బోసి లాగినన్
బట్టిన పట్టు వీడ దిదిబా గిదియో గని చూడ దీశ్వరా. 45

చ. వినఁగ వినఁగ విస్మయంబి వినుల కెక్కుడు నెక్కు జీర్ణమై
మనమునఁ బట్టుభావములు మాటలకెక్కుడుఁ; బల్కఁబల్కఁ [illegible]
కొనునవి కార్యరూపమును గోరినకోర్కెలు కార్యరూపముక్
గనిన ఫలాగమంబెటఁలు గాంచవు నీకృపగాంచి యీశ్వరా! 46

ఉ. పుట్టినయూహ పుట్టినదిపుట్టినటుల్ చనుఁ గొన్ని చోట్లఁ బై
మెట్టున కెక్కు మాటలకు మీఁద నడంగును గొన్నిచోట్ల న
ట్టిట్టును గొంతమైన తఱినాఁగెడు నింకను గొన్నిచోట్లఁ జూ
పట్టదు మేలికార్య మొకపట్టునఁ బూర్తిగనైన దీశ్వరా. 47

ఉ. ప్రాణములన్నఁ దీపి ప్రతివానికిఁ జూడఁగ రోఁత యెందు కీ
ప్రాణమటన్నవానికిని బ్రాణమువాయుట యన్న గిట్ట దే
మాన్కొ ముందుమాట యని యప్పటి కున్నది వీడనొల్ల రీ
మానసవృత్తి యట్టిద దిమార్పఁగ నీవె శరణ్యమీశ్వరా. 48

అంతరాత్మ.

చ. అనుకొనరాని కార్య మెది యైన నొనర్పఁగఁ బోవునప్పు డే
మనుజునకైనఁ దొల్దొలుత మానస మాదును నేఁటొ కూడదా
పనియని చెప్పు; దేవునిది పల్కది దాని నతిక్రమించి చే
సినయెడ నెక్కుమాఱు మఱి చెప్పదదే పరమాత్మ యీశ్వరా. 49

చ. సునిశితమైనకత్తిఁగొని సొంపుచెడం గొఱగానివస్తువున్
దునుఁగఁగఁ జేయ మొద్దగుఁ జనున్ గలవాఁడియశేష మంత నా
పని యది సేయఁ బోదు; మఱి పల్మఱునూఱినఁగాని వాఁడియే
కనఁబడబోవ దట్టిదియె జ్ఞానము ధర్మనియంత యీశ్వరా. 50

దుర్వృత్తి.

ఉ. తిట్టిన నూరకుంట జగతిన్ గడు దుష్కర మెంతవానికిన్
బుట్టక మాన దల్క వెలిఁబోవున దప్పుడె శీఘ్రకోపికిన్;
అట్టి యడంగియుండుఁ గుటిలాత్ములకద్ది ప్రశాంతులౌదురే
యట్టి దురాత్ములెట్టి పనికైన సమర్థులు వార లీశ్వరా. 51

చ. కుమతుల దుష్ప్రయత్నములు గొబ్బున సాగు ఫలింపవట్టి
కార్యము లెపుడే నొనర్ప నమలాత్ములు పాతక మంటకుండఁ బా
పము లేకఁ జేయకుండ ఫలభంగ మొనర్తురు సజ్జనాళికిన్;
సుమతులు నీకుఁ జుట్టములె సుంతయుఁ బైఁ బడ నీయవీశ్వరా. 52
చ. నిరతము పాపకార్యములు నెమ్మి నొనర్తురు నీచులెన్నియో
దొరలవు. పైకి సజ్జనుఁడు దొంగతనంబుగఁ గాదు కూడ దం
చరసి యొనర్ప నేదియొ బయల్ పడునప్పుడె తెల్లబట్టపై
వటులు కళంక మింతయినఁ బైకిఁ గనంబడుఁగాదె యీశ్వరా. 53

ఉ. అందఱుగూడఁ గన్పడుదు రార్జనచేసినవిత్తమెల్ల నా
నందముగా భుజింపఁగఁ; గనంబడఁ డొక్కఁడు కూడఁగష్టముల్
వెందెడువేళ; గన్పడకపోయినఁ బోదురు కాక; తిట్టిపో
యందొఱఁ గొందు రార్తుఁడని యత్తఱి జాలి దలంప రీశ్వరా. 54

ప్రపంచరీతి.

ఉ. పెంచెద రీ శరీరమును బ్రీతిగ లక్షలు వెచ్చపెట్టి య
ర్పించుట కగ్నిహోత్రునకొ పృథ్వికొ పీనుగుపెంటసేతకో
యెంచరు పెంచ నాత్మఁ; నది యెంతకృశించినఁ బెంచుత్రోవఁ జూ
పించినఁ జూడఁబోరు; పయి పెచ్చది పిచ్చి యటందు రీశ్వరా. 55

చ. మనసుఁ గరంచి శోకము సమంచితలీల నటింప నాటకం
బున నది గాంచి శోకమున మున్గఁగఁ బ్రేక్షకు; లొక్కఁ డాటనే
ర్పని యది మెచ్చి సంతసిలు; నాతనిఁ దిట్టుచు వానిఁ బిచ్చివాఁ
డని నగునట్టు లాటబ్రదుకన్నతని న్నగుచుందు రీశ్వరా. 56

ఉ. ఆలిని బిడ్డల న్విడిచి యాటలపాటలలో మునింగి యే
వేళను నింటిమాటఁ జెవిపెట్టనివాని మనుష్యుఁ డందు రే
యాలును బిడ్డలుం బ్రదుకులాటలుగా వ్రకొ మూలమెన్న కా
జోలికిఁబోక త్రిమ్మరెడువారల నేమన వచ్చు నీశ్వరా. 57

ఉ. క్రుంగునుమానసంబు ప్రతికూలఫలంబు లభించుపట్టునన్
బొంగును గోరుకొన్న ఫలముల్ సమకూరెడువేళ నెప్డు నా
క్రుంగును బొంగుఁజిత్తమునఁ గూడకయుండ సమత్వబుద్ధి ని
ల్వంగలదేని నీదు పదభక్తికిఁ ద్రోవ లభించు నీశ్వరా. 58

చ. పొగరుగనున్నవేళఁ గడు పుల్లనికాయయుఁ బల్కఁబాఱి తా
నెగడినవెన్కఁ దీయఁబడు, నీపదభక్తి లభింపనట్టులే
పొగరణగుంగదయ్య యికపుట్టదుబుద్ధి ప్రపంచమందు మి
థ్యగఁగనిపించు నీషణములన్నియు దాని నొసంగు మీశ్వరా. 59

## ధ్యానము.

మ. నిను ధ్యానింపఁ దలంప వేత్రౌ తలఁపుల్ నిండున్ మదిన్ భూమి నీ
తను వెన్నాళ్లు నటించు నశ్వరము; నీతత్త్వంబు నెవ్వండు గ
న్గొన శక్తుండగు నాతఁ డొక్కరుఁడె నిన్నుం బొంద నర్హుం డతం
డనవద్యుండు తదీయవర్తనమె భవ్యం బెన్న సర్వేశ్వరా. 60

మ. నిను ధ్యానింపని నీచునిం దరికిరానీ రాప్రులున్ జుట్టముల్
గనుఁ గేవన్ గనఁబోరు దిక్కు దెసయుం గా చండతండతముల్
గను దైన్యంబున నీదుభక్తి భవరోగంబుల్ దొలంగించు ము
క్తిని జేకూర్చునఘంబుదూల్చును సుఖాబ్ధిం దేల్చు సర్వేశ్వరా. 61

చ. తలఁచినయంతమాత్రమునఁ దక్షణమే మది వచ్చి నిల్తువే
నిలుపఁగలేరు నెమ్మదిని నిశ్చలత న్నినుఁ; జిత్తవృత్తికిన్
నిలుకడలేదు నిల్కడకు నీకృపదక్కఁగ మందులేదు నీ
సలలితసత్కథామృతము చక్కఁగఁ గ్రోల్పఁగదయ్య యీశ్వరా॥62
మ. కరుణాసాంద్ర జగచ్ఛరణ్య నత భక్తవ్రాతకల్పద్రుమా
నరులున్ నిర్జరులున్ దపోధనులచెంతం జేరి నీయున్కిచా
ప్పరయన్ జూతురు మృత్యువుం గెలిచి వారమ్మార్గమౌ యోగవి
స్ఫురణం గాంతురు నీదు సేవనుగదా మోక్షంబు సర్వేశ్వరా. 63

మ. ఒకఁడా స్వర్గసుఖంబుఁగోరెడు నొకం డుత్సాహముంబొందు నై
హికవిఖ్యాతికి లేదు శాశ్వతసుఖంబిందెందునన్ జన్మతా
రకమౌ మోక్షముగల్గు భక్తి నిను నారాధింప నానందదా
యకమౌ నీయమలాంఘ్రిసేవ యదె నిత్యానందమౌ నీశ్వరా. 64

మ. మతకర్తల్ మహితాశయంబు లను సన్మార్గంబులన్ జూపి స
ద్గతిఁ బొమ్మందురు నీకృపంగనక మోక్షంబబ్బునే దుఃఖముల్
హతమార్పంగ నఘంబుదూల్ప నిల సర్వానర్థముల్ వాప నా
కృతిశూన్యుండవుఁ దాల్తు వాకృతుల నెన్నే నిచ్చమై నీశ్వరా. 65

మ. నినుసేవింపనివాఁడు దుఃఖి యగు, వాసిం గన్నఁగోపంబె నీ
కనఘా! నీకడఁ గోపమున్ బగయులే; వాపాపి శిక్షించుశా
సనమానయ్యది; సూక్ష్మవీక్షణానికిన్మాత్రమైన న్నినుఁ
గనినన్ బోల్చెదు; నిన్నుఁబూర్ణముగఁ గన్నారెవరు ? సర్వేశ్వరా. 66

చ. కలరు ప్రపంచమందు మతకర్తలు వందలువేలు వారిలో
వలు తలక్రిందుత్రోవలుగ వర్తిలు సుతయుఁ బోల్కి లేనటుల్
విలసిలు; నెంచిచూచిన విభేదములన్నియు బాహ్యవృత్తులన్
వెలసెఁగాని భక్తికిని నీతికిఁ గల్గునె? భేదమీశ్వరా. 67

చ. హరిహరులన్న భేదమెపుడాదిని గల్గెను ! మూలకారణం
బరయఁ బ్రవృత్తిమార్గ మొకఁ డందు నివృత్తిపథంబు వేఱొకం
డఱమర లేదు రెండిటికి నద్దియు నిద్దియుఁగూడ ముక్తికిం
దెరువులె భేదమెంతు రవనిం జెడిపోదు రెఱుంగ కీశ్వరా. 68

విగ్రహారాధనము

ఉ. ఆకృతి లేనివాని మదినైనను భావన సేయుటక్రియన్
జేకుఱు నేగుణంబయినఁ జిత్తమున న్నిలుపంగరూప మే
యాకరమౌట తద్గుణము లాకృతిశూన్యములౌట నవ్వి య
స్తోకముగాఁగ నున్నతని స్తోత్రము సేయఁగ నిల్పి రీశ్వరా. 69

## భగవన్మహిమ.

ఉ. సుందరవస్తువేదయినఁ జూచినయంతనె యంతరంగ మా
నందమునొందు, నే మది యనర్ఘ భవదాకృతిలోపశూన్య మా,
నందము లోపశూన్యతగదయ్య ! యదెంతగనున్న నంత యా
నందము, హర్షసత్కళ యనంగను నీవెగదయ్య! యీశ్వరా ! 70

చ. తనదు మనంబెఱుంగు నుచితజ్ఞునిఁ గాంచి కవీశుఁడెంతయుఁ
మనమున సంతసించునటుమాదిరినే భవదక్షరత్వముం
గని యలరారు జీవులను గన్గొని వారలతోడనైక్యమై
జననము కల్గినందుల కెసంగు ఫలంబు నెసంగు దీశ్వరా ! 71

చ. పదుగురుగూడ దుఃఖమునం బాల్పొనఁ దగ్గెడు దుఃఖభారమౌ
పదుగురుకూడనుండిన నపారముగన్ సుఖసన్నివేశముల్
పదుగురుగూడుచోటఁ గనవత్తువు హర్షమయుండవీవు, నీ
వెదవినచోట హర్షమునకుండునె సుంతయు లోప మీశ్వరా! 72

మ. నిజసామర్థ్యమునన్ సమస్తజగముల్ నిర్మాణముం జేసి త
త్ప్రజలన్ నాటకపాత్రలన్ బలె సముద్యల్లీల నాడించి స
ర్వజనాతీతవిచిత్రచిత్రిత జగద్రంగస్థలిం ద్రిప్పు నా
త్రిజగన్నాటక సూత్రధారుఁ డెవఁ డాదేవుండ వీ వీశ్వరా! 73

శా. నీకంటెన్ బరమస్వతంత్రుఁ డనరీ లేఁడంచు వాక్రుత్తు రా
వాకుల్ మిథ్యలటయ్య ! దాసులెడ నీవర్తించు త్రోవల్ గనన్
నీకంటెన్ బరతంత్రుఁ డెవ్వఁడును లేనే లేఁ డనన్వచ్చుగా
నీకుండన్నది లేదె వారి మదులందే తక్కఁజోటీశ్వరా ! 74

పురాకృతము.

ఉ. మ్రొక్కులు నీకుఁగావలెనె ? మోక్షమొసంగఁగ నీవుకర్తవే ?
చిక్కులు నీవుపెట్టెదవె ? చిత్తము నీవు గలంచువాఁడవే ?
యెక్కడిదో పురాకృత మదేడదొ మ్మూలమెఱుంగరాని దీ
చిక్కులకెల్లకర్త యదె, చిత్తము త్రిప్పులఁబెట్టు నీశ్వరా 75

ఉ. పేరు, ప్రతిష్ఠ, వచ్చునది, పెద్దఱికంబునఁగాదు, ధీబలో
ద్ధారణ చేతఁగాదు, సముదారగుణోన్నతి చేతఁగాదు, దు
ర్వారపురాసుకర్మపరిపాకముచేత లభించు దానినె
వ్వారునుమీరనేర రెదివచ్చిన దాననె వచ్చునీశ్వరా ! 76

చ. మనుజున కొక్కరీతి; యది మార్పఁగబ్రహ్మతరంబుగాదు, ప్రా
గ్జననమునందె యేర్పడును గాఁగలవానికి మూలబీజముల్
తనదువివేకసంపదల దానిమరల్పఁగ నెంచుప్రాజ్ఞుఁ డెం
తని సవరించుచున్న మొదలంట నశింపదు నైజమీశ్వరా ! 77

ఉ. ఎచ్చటనుండు వీవు? గన నెవ్వరివాఁడవు ? నిన్నుఁజూడఁగా
నిచ్చజనించునేని యెటకేగవలెన్ ? నినుఁ గొల్చువారికిన్
వచ్చెడిదేమి ? నిన్నుఁగొలువంగలవా రెటువంటివార లే
మిచ్చిననీకుఁ బ్రీతియగు నేర్పడఁ దెల్పఁగదయ్య ! యీశ్వరా ! 78

ఉ. అంతటఁగూఁడనుండువఁట, యాదఅవాఁడవు నీవెయంట నీ
యంతటివారిఁ జేయుదఁట, యాశ్రితులన్ దరిఁజేర్తువంట య
యత్యంతవినిర్మలాత్ములు, సహస్రముఖంబులఁ గాతువంట, యా
ద్యంతము లెట్టివో యెఱుఁగవంట నిజం బెఱిఁగింపుమీశ్వరా ! 79

చ. మృతిని మదిందలంచి యెవరేపనిఁ జేసినఁ జేయుచుండినన్
గతియిఁక లేమ దుర్గతికి, కానివి యైనవి యేమిచేసినన్,
బ్రతుకిది శాశ్వతంబనెడి భావముచేఁగద, యద్దిమాఱి, శా
శ్వతమిదిగాదటన్న నిఁకవంకరమార్గములెందుకీశ్వరా ! 80

ఉ. చచ్చిననొక్కమాఱు మఱిచత్తురె ? చావనసేలభీతిలన్
వచ్చును, రాకమానదది వచ్చెడివేళకు రుద్రుఁడడ్డినన్
జచ్చిన నొచ్చిన న్మదికి నచ్చినకార్యముసేయ రేలొకో
చచ్చిన వచ్చు స్వర్గము; యశంబు ఫలాగమమైననీశ్వరా ! 81

మ. ధనమే దేవత లోకమంతకును; దద్దాసానుదాసత్వమే
జనులే వేళలఁ జేయుచుండినను, నేచందంబునన్ జేసినన్
జననంబెందులకో! యదెట్లమరునో! సాఫల్యమీజన్మకే
పనిచేఁగల్గును! దానిమాటయె దలంపన్ బోరు సర్వేశ్వరా! 82

ఉ. అప్పుగ వేసితా మొరుల నార్తినిబెట్టెద రప్పుఁదీర్ప నా
యప్పులవానికిన్ జననమందెద రల్పవయస్కులౌదు కా
నప్పిడనార్తియేలసిన నాసవిడం డతఁడప్పువోయినన్,
ముప్పిది యాసదోసముఁన మూఁడినదా, సయనర్థమీశ్వరా! 83

## ఆ శ.

ఉ. ఆసనిరాశకైనయెడ నన్నియనర్థము లున్నశించు నే
దోసముకూడఁ బైఁబడదు; దోసముసేయు నశించు బీజమే
యాస నశింప నీజగతి యందలి భ్రాంతి నశించు నందుకే
యాసలఁద్రుంతురాత్మసుఖమందఁగఁగోరు మహాత్ములీశ్వరా ! 84

చ. కనకము కాంతయన్న యవి గల్గును రెండు మనంబు ద్రిప్పఁగన్
గనకము మీఁది యాసవిడి కానలఁ జేరఁగవచ్చు నెట్టులో;
కనకపుటాసకన్ననతి కష్టము కాంతల యాసవీడుటల్;
గననివి రెండు వీడినను గాని లభింపదు మోక్షమీశ్వరా ! 85

ఉ. దానమటన్నమాట చెవిఁ దాఁకినయంతనె యెంతవానికిన్
బ్రాణము పోయినట్లు గనుపట్టెడు; కాలుని బంట్లపోలికన్
గానఁగనౌదు రాపనులకై తలపెట్టెడి వారలెల్ల రీ
దానము ముందులోకమున దాఁపఱికంబని చూడరీశ్వరా! 86

ఉ. దండుగ కెంతసొమ్మయిన దాఁపక యిచ్చెదు తెచ్చుఁ జేఁత లే
కుండిన, సంచినిండ ధనమున్నను దమ్మిడియైనఁ బైకి రా
కుండెడు ధర్మమన్న మనసొప్పదు; దండుగ కిచ్చి చెప్పుకో
కుండెడుఁ; జాటుచుందు దృణమో కణమో యిడి ధర్మమీశ్వరా!

ఉ. ధర్మము పేరిటం జనునధర్మము పేరనె లేదుదానికే
కర్మముగాని ధర్మమును గాదని చేసినఁ జెప్పుచుందురా
ధర్మముపేరె వక్రగతి దానిమరల్చి యిదొండుచాలదే
ధర్మము చేయఁగాఁదగు నధర్మము కూడ దనంగనీశ్వరా! 88

మాతృదేశప్రశంస.

మ. తనదేశంబును దన్నుఁ గన్నజననిం దాత్పర్యసంయుక్తుఁడై
గనుఁగోఁడెవ్వఁడతండు మానవుఁడనంగా వచ్చునే తల్లి యి
చ్చిన దీదేహము, తల్లిదేశమవనిం జీవంబులన్నిల్పఁ గో
రినదెల్లం దయసేసె వీరి మఱువం శ్రీలుండు నెట్లీశ్వరా! 89

మ. ఇదినాకున్నది, యిద్దిలేద నెడుపట్కేనాడున్ లేక సం
పదలెల్లన్ దులఁదూఁగుతల్లి కలలైశ్వర్యంబులున్ వోయె; యో
గదశల్ మాత్రను, దాస్యవృత్తి యొదవెన్ గారాగృహావాప్తి య
య్యెఁ దుదిన్; బుత్రులు శత్రులైరి యిఁకనే వేదిక్కు సర్వేశ్వరా!

చ. ధనమున కాసఁజెంది తనుతల్లిని, సాధ్విని, దాస్యవృత్తికిన్
బనుపుఁడటన్న సిద్ధపడు బానిసలున్ గలవారలిప్డు, మా
జననికి మానహానియని సైఁపఁగఁ జాలమటన్న వారి బం
దెనుబడఁద్రోయఁ జూచెదరు; దిక్కికనెవ్వరు తల్లికీశ్వరా! 91

ఉ. బొందెలనుండెఁ దల్లియనుభావమొకింతయు లేదు, తిందు రా
నందముగా లభించెనని నవ్యపదోన్నతి; దాస్యవృత్తి నే
యుందుమటందు రెవ్వను మహోన్నతియద్దియె యందు రర్థ మే
యందురు లోకమెల్లఁ బరమార్థ మెఱుఁగ రభాగ్యులీశ్వరా! 92

ఉ. ముందొకఁ డెవ్వఁడో నడువ ముక్కుచు మూల్గుచు వెన్కనేగువా
రుందురు కాని ముందు ఘన నుండఁడు నూటికిఁ గోటికొక్కడుగ్
ముందుగ నేగ నేమగును మొప్పమటంచుఁ దలంచి పోవలే
మందు రదేమొ కాని భయ మచ్చిటి కష్టగదయ్య! యీశ్వరా!

చ. చలిగల నీట నేట దిగిస్నానముసేయ మనస్సుజంకు; లో
పలదిగుదాఁకనుంకునది, స్వార్థము వీడి పరోపకారముం
జలుపఁగఁ బోవుచో మనసు జంకుట సాజము, సాహసించి చే
గలయది చేయఁ గాఁగలుగు కార్యమదేయగు నెట్లొయీశ్వరా !

ఉ. వాఁడును వీఁడు వచ్చునని వచ్చినదాఁకను గూరుచున్న నే
నాఁడును సాగదేపనియు నమ్మిపదార్థము స్వార్థమట్లు వె
న్నాడక దైవమే గలఁ డటంచుఁ ద్రిశుద్ధిగఁజేసినప్డె యే
వాడను గార్యసిద్ధియగు నమ్ముగనే నిను నమ్మ నీశ్వరా ! 95

చ. ఒకమతమున్నచోట మఱియొక్కటి నిల్వదు; నిల్చియుండునో
వికలత చాలఁగల్గి పగవిస్తరిల్లుఁ మతమెన్నిరూపులన్
బ్రకటితమైన నొక్కఁడను భావము భారతభూమియందె గా
కిఁక నొకచోట నున్నదె యనేకమతంబుల కైక్యమీశ్వరా! 96

ఉ. కాలము సేయుమార్పులను గాంచఁగ నేరరు చెయుచుండునే
వేళకు నేదికావలెనొ వేళకొలందిగ నద్ది, చేయఁగాఁ
జాలఁడెవండుకాని కొనసాగదు కాలము గూడకుండినన్;
కాలముసేయుఁ దామని యొనర్చితి మందురు లోకు లీశ్వరా. 97

చ. మనసొకపట్టున న్వినదు, మాటలతోఁ బనిసేయనెద్దియున్
జనువునన్ భయంబునను సన్నిహితంబొనరించుకొన్న నే
పనియును జేతకాదనదు భారము గీరము చూడఁబోదు, శ్రీ
ర్వనఁ జనునిష్టమైనయెడఁ బూర్తిగఁ జేయుఁగ సర్వమీశ్వరా. 98

ఉ. దానిసవృత్తిచేసికొని స్వర్గమున న్వసియించు కన్న నే
ఘోనరకంబె స్వేచ్ఛగను నచ్చుట రాజ్యము సేయ నబ్బినన్
దేనికి స్వేచ్ఛ? తుచ్ఛమగు దేహముకా?-యమలంపుటాత్మకా?
కానరు ముందుసౌఖ్యమును గాంచెద రెప్పటిదప్ప ఉశ్వరా. 99

చ. పురువుల గుంటలోఁ బడి పొర్లుచు నందున నేమి సౌఖ్యముల్
వఱలునటంచు నెంచెదరు వారవి పుర్వులటంచు నెంచరో
పురువులునాకు గూడ నొకపుట్టువె పుట్టిరొ? సౌఖ్యమన్నదే
యెఱుఁగరొ? చూడ హేయమగు నీజననస్థితి సర్వమీశ్వరా. 100

ఉ. ఆసల వీడకుండఁ గలయార్జనమున్ ద్యజియింపకుండ సం
త్రాసముఁ జెందకుండ, నిజదారసుతాదుల వీడకుండ, సం
న్యాసము నందకుండఁ దమప్రాణము లర్పణసేయకుండ నా
యాసముగా స్వరాజ్యసుఖ మబ్బునె? త్యాగము లేక యీశ్వరా.

చ. అనృతము నల్కుకన్న నిజమాడుట చుల్కన లోకులెల్ల నీ
పనిసులభంబుగా నొనరుపం దగినట్టిదె, యింతమాత్రపుం
బనికిఁ ద్రిశంకుపట్టిని బ్రపంచ మహాశయుని పల్కనేల? యీ
పనియును జేయు వాఁడిల నెవండును లేమిని గాదె యీశ్వరా. 102

చ. గడచిన దానికై వగచి కార్యముపట్ల నిరాశఁజెంది వె
న్కడు గిసుచుండు గజ్ఞు; లెదో యైనది దాని విచారమేల; చే
ద్పడుచు మెలఁగినన్ ఫలము పొటగునే 'యని ప్రాజ్ఞులెప్పుడున్
దడయక ముందు యత్నము నొనర్తురు; కార్యము వీడరీశ్వరా! 103

చ. దినములు చాలనప్పుడు పదింబదిగా నెనలేని కష్టముల్
మనుజునిమీఁద వచ్చిపడు; మబ్బు వడిన్ విడిపోవు నట్లుగా
దినములు మంచివైన దురదృష్టములెల్లఁ దమంతనే తొలం
గును; శుభముల్ చెలంగు; నవి కోరినయట్లు మెలంగ నీశ్వరా.

ఉ. లోపము లెన్నుచుండుఁ దనలోపముఁ గప్పుకొనంగ లేనివా
రోపణఁ జేసి యన్యునకు; శ్రోత్రియు నట్టునటించుచుండుఁ; జా
పోఁడు దుర్జనుండు; గుణమున్నఁ గనం డధికుండు తుల్యుఁడుం
దోపడుఁ వాని కెందుఁ దనదోషము దాఁగని యొప్పు డీశ్వరా! 105

చ. తనమది నెట్టిభావములు దాల్చునో యటువంటి వానినే
కనుట స్వభావమీమదికిఁ గాని మనంబులు కాని వాని నే
కనుగొనుచుండు నైనయవి గన్గొను నైనవి; కానివానినిఁ
గనవు; గుణంబు దోషమును గాంచ మనస్సె ప్రధాన మీశ్వరా!

ఉ. ఆదిగదయ్య సౌఖ్యముల కన్నిటి కాత్మసుఖంబు దాని మో
తాదున కింతకింతయని తగ్గును హెచ్చును లేదు, హెచ్చుగాఁ
బోదు తినన్ గినన్; విషయమోహ సుఖంబుల కెచ్చుతగ్గుగా
రాదు; ప్రమాణము న్విడునఁ బ్రాణముమీఁదికి వచ్చు నీశ్వరా.107

ఉ. విఘ్నములంచు వానికొక వేల్పధిదేవతయంచు, కార్యని
ర్విఘ్నతయంచు; విఘ్నపతి వేఁడుటయంచొక నేమమున్నదే
విఘ్నము లేల కల్గు నిను వేఁడెడివారికిఁ గావె। సర్వదో
షఘ్నుఁడ వీవు నీమహిమఁ జాటఁగ వేఱొకఁ డడ్డె యీశ్వరా! 108

చ. ఇసుమును బంచదారయును నేకముగాఁ గలియంగ శర్కరన్
మెసవెడు చీమయట్లు గుణమే గ్రహియించెడు సజ్జనుండు నీ
దెసఁ గనుఁగల్గువారికి మఱిన్ గనుపట్టను దోసమెద్దియున్
గుసుమమునన్ మరందమును గ్రోలు మధువ్రతమెప్డు నీశ్వరా! 109

ఉ. హూణశకాన నిర్వదికి నొక్కటి తక్కువయైన నూటులున్
బైనీకనిర్వదైన పయువత్సరమందు ద్వితీయమాసమం
దేనిదిపూర్తి చేసితిని నెప్పటి భావము లప్పుగూర్చి లో
కానుభవంబుపేర. నొకయబ్దములో నపుడప్పు డీశ్వరా. 110

ఉ. ఆయత తల్లప్రగ్గడ మహాన్వయ సంజనితుండు లక్ష్మి నా
రాయణ మంత్రిదత్తసుతుఁడౌ చినవేంకటరామమంత్రికిన్
శ్రీయుత లచ్చమాంబకు జనించిన యగ్రసుతుండు సూర్యనా
రాయణ కాన్క నీకిది సమర్పణసేసె గ్రహింపు మీశ్వరా. 111

మొదటిభాగము సమాప్తము.

| | |
|---|---|
| మాధవీకంకణము (ప్రథమభాగము) | 0—8—0 |
| రాధారాణి | 0—4—0 |
| దాదాభాయినౌరోజీ | 0—1—0 |
| వినోదిని (రవీంద్రనాధ ఠాకూరు Eyesore కు తెలుగు) | |
| ప్రథమభాగము. | 0—12—0 |
| ద్వితీయభాగము | 1—0—0 |
| ఆంగ్లేయుల జాతిభేధములు | 0—2—0 |
| ఆంగ్లేయుల మతిభేధములు | 0—2—0 |
| మీరాభాయి | 0—1—0 |
| పాంథస్వప్నము | 0—2—0 |

భాగినేయవియోగము (పద్యములు) 0—2—0

లోకానుభవము (దేశభక్తిపూరితములగు పద్యములు) 0—4—0

భవభూతి—ఆయన ప్రతిభావిశేషము (ఆంగ్లమున వ్రాయబడినది) 0—6—0

ఉత్తరరామచరిత్రము (ముద్రణముననున్నది.) 1—0—0

లక్ష్మీసరస్వతులు (పద్యములు) 0—1—0

ప్రతాపసింహవిజయము (పద్యములు) 0—1—0

వలయువారు,

సరస్వతీ భవనము.

కొవ్వూరు, గోదావరీతీరము.

